మి అ వు

ఉఋము

అకార

ఉకార ఓమ్ మకార



# తనుసాంఖ్య ప్రాపంచిక విమర్శనరత్నాకరం

శ్రీ స్వామి చిద్వేంకట రామబ్రహ్మానంద గురుచరణా
రవిందసేవాసంజనితమరందబిందుసందోహనిష్యంద
మార్ద్రీకృత మత్త భ్రమరాయమాణ చిత్తుం
డున, సృష్టి కొంకుదురుపురమున్న, స్థితి
సర్వజగత్తును నిండియున్న విశ్వకర్మ

కొనూరు తాతాచార్య
[నిత్యానందంచే]
రచింపబడి,

రాజమహేంద్రవర వాస్తవ్యులు
బ్ర. శ్రీ. పండిత, మల్లాది లక్ష్మీనరసింహశాస్త్రిగారిచే
పరిష్కరింపబడినది.

1944



# తనుసాంఖ్యప్రాపంచిక విమర్శన రత్నాకరం

గ్రంథకర్త:


కానూరు తాతాచార్యులు

అను

## నిత్యానందస్వామి


రాజమహేంద్రవరవాస్తవ్యులు

బ్ర॥ శ్రీ॥ పండిత, మల్లాది లక్ష్మీనరసింహశాస్త్రిగారిచే

పరిష్కరింపబడినది.


ప్రకటనకర్తలు

శ్రీ అప్పసాని వీర్రాజుచౌదరి & కొవ్వూరి సత్తిరెడ్డిగార్లు,

గొల్లలమామిడాడ

# విజ్ఞాపనము

శ్రీసద్గురుచరణారవింద సంజనిత మరందబిందుసందోహ నిష్యంద బంభరాయమానపారీణుండు కానూరు తాతాచార్య నిత్యానందం గుర్వాజ్ఞ శిరసావహించి యీమహాత్కార్యమునకుఁ దోడ్పడు భక్తాగ్రేసరులకు సహస్రవందనములు సమర్పించి విన్నవించున దేమనగా—

మహనీయులారా! వేదవేదాంతపారంగత మునిశ్రేష్ఠులారా! సంగీతసాహిత్యవిద్యాప్రవీణులారా! వర్తకవ్యాపారఘటికులారా! వ్యవసాయాదిధనార్జనభూస్వాములారా! మీరలెల్లరు తమతమశక్త్యానుసారముగ మేముకట్టించు శ్రీ విరాట్టు పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వాములవారి పూజామఠమునకు ధన సహాయ మొనర్తురుగాక యనికోరుచున్నాము. ఈమఠమునకు ప్లాను, యంత్రమును శ్రీ శ్రీ శ్రీ పండిత శిల్పివిద్వాన్ తాతోలు నాగభూషణాచార్యులుగారును, శంఖుస్థాపన, ప్రతిష్ఠా వగైరాలు శ్రీమాన్ స్వామి చిద్వేంకటరామబ్రహ్మానంద మహర్షి గారున్ను నిర్విఘ్నముగా నెరవేర్చెదని మాప్రార్థన.

ప్రపంచమందు పండితులు, పామరులు, సామాన్యమానవులును, అనేకవిధ గౌరవాగౌరవముల నంది తుద కొకేరీతిగ సృష్టిలయభావ మందుచున్నారు. వేదములే జగదాధారములు. ఆవేదాంతరసంపుటియే సర్వశాస్త్రములు. ఈవేదశాస్త్రములకు

పై భావము వేదాంతమై ఏకరూపప్రకాశమానమైనట్లు, అకార, ఉకార, మకారములు ఓం అనుప్రణవమై, అదియే ప్రణవార్థమై, అనగా రెండై ఆ మకార, ఉకార, అకారముల దృశ్యములై, అనగా లయమై తిరిగి ఒక్కటే అయినట్లు ప్రపంచంలో ఉద్యోగా లెన్నున్నా 'పవరు' ఒక్కటే అవుతూంది. కావున నేను రచించిన గ్రంధమం దేమైనలోపాలోపము లున్నయెడల నేను నీవు అనుపదార్థములను గ్రహించి పొరపాటులేమైనా ఉన్న సవరణ చేస్తూ పరమాత్మయందు లక్ష్యార్థముంచి నన్నుక్షమింప వేడుచున్నాను.

శ్లో॥ అఖండమండలాకారం వ్యాప్తిం యేన చరాచరం। తత్పదం దర్శితం యేన తస్మై శ్రీగురవే నమః॥ జలే విష్ణు స్థలే విష్ణు ర్విష్ణు స్థావరజంగమాః। అంతర్విష్ణుబహిర్విష్ణుస్సర్వంవిష్ణుమయంజగత్ ॥

అనగా స్వరూపరూపగుణవిభవాదులచే సర్వోత్కృష్టుఁడై, అఖిలచేతనాచేతనాధారుఁడై, తనకు వేరొకఆధారములేనివాఁడై, దేవమనుష్యాదిజాతులు, శ్వేతాదివర్ణములు, వృద్ధిక్షయాదివికారములు, జననమరణాద్యవస్థలు లేనివాఁడై, అప్రమేయజ్ఞానశక్త్యమితైశ్వర్య వీర్యతేజుండై, షడ్గుణైశ్వర్యసంపన్నుఁడై, అనంతనామములతోఁగూడి అనంతకోటిబ్రహ్మాండంబులు సృజించి, వానినన్నిటి ననంతజీవకోటిచే బ్రకాశింపజేయువాఁడు పరమాత్మ. ఆపరమాత్మను దెలిసికొన్న మహాఋషిపుంగవుడు శ్రీశ్రీశ్రీ పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వామి. వారిపూజాదినిమిత్తమై యీ

పుతము కట్టబడుచున్నది. ఇంకను విశేష మేమనగా శ్రీకృష్ణభగవాను డర్జునున కుపదేశించిన గీతలో—

శ్లో॥ పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతాం।
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే॥
యదాయదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత।
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహం॥

అని చెప్పబడియున్నది. అందుచే నీయుగమందును పరమేశ్వరుడు మానవరూపముతోనే సత్వ, ధైర్య, శాంతములు, ప్రకాశవంతమైన పుల్ పవరు, శిష్టరక్షణ, దుష్టశిక్షణలకొఱకవతరించినవారే పరమేశ్వరులు.

మ. రా. శ్రీ అప్పపాని పిర్రాజుచౌదరిగారి మాతామహులు కీ॥ శే॥ వజ్జనేని వెంకటస్వామిచౌధరిగారిపేర శ్రీ విరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వాములవారి మఠమునకు నాలుగు సెంట్లభూమిన్ని, స్వామిప్రతిష్ఠకయ్యే ఖర్చులును సమర్పించి యున్నారు. వీరికి కృతజ్ఞతాపూర్వకవందనములు.

ఇట్లువిధేయులు,

గొల్లలమామిడాడ విశ్వబ్రాహ్మణ యువజనసంఘం,

కానూరు తాతాచార్య నిత్యానందస్వామి

(రా జ యో గి.)

# తనుసాంఖ్య ప్రాపంచిక [illegible]

# రత్నాకరం

### గురు పరంపర ధ్యానం

ఓం నమో బ్రహ్మాదిభ్యో- బ్రహ్మవిద్యాసాంప్రదాయ కర్తృభ్యో-వంశఋషిభ్యో- మహాద్భ్యో నమో గురుభ్యః.

సర్వోపప్లవరహితజ్ఞాన ఘనప్రత్యగర్థో బ్రహ్మైవాహమస్మి. అహంపదార్థరహితః

శ్లో. ఓంకారపీఠసిద్ధాంత బ్రహ్మవిద్యోపదేశికం। శ్రీమన్నారాయణం సూర్యం సద్గురుభ్యో నమో నమః॥ యాజ్ఞవల్క్యంచ జనకం శుకం సాందీప మీశ్వరం। కృష్ణ మర్జునసహితంచోద్ధవంచ నమోనమః॥ అచలావధూతయోగీంద్ర బ్రహ్మనందశుభోదకః। అమలానందస్య సద్యోగీ రామబ్రహ్మగురుం భజే॥ రామబ్రహ్మేంద్రయోగీంద్రం పరబ్రహ్మం గురుంభజే। కానూరువంశసంజనితో తాతాచార్యో నమామ్యహం॥ అస్మద్గురుసమారంభా కృష్ణసాందీపమధ్యమాం। శ్రీమహావిష్ణుపర్యంతాం వందే గురుపరంపరాం॥ సచ్చిదానందరహితం సర్వద్వంద్వవివర్జితం। రామబ్రహ్మేంద్రయోగీంద్రం సద్గురుం త్వాం నమామ్యహం॥ సత్యాసత్యవిహీనంచ ధర్మాధర్మవివర్జితం। రామబ్రహ్మేంద్రయోగీంద్రం సద్గురుం త్వాం నమామ్యహం॥ బంధాబంధవిశూన్యంచ బాహ్యం సర్వత్ర వ్యాపితం। శ్రీరామబ్రహ్మయోగీంద్రం సద్గురుం త్వాం నమామ్యహం॥ నిరాభాసనిరా

ధారం నిరాకారనిరంజనం। నిత్యానంద్రదాతారం భావాభావమ తీంద్రియం। రామబ్రహ్మేంద్రయోగీంద్రం సద్గురుం త్వాం నమామ్యహం॥

## గు రు పూ జ.

శ్లో॥ ధ్యానమావాహనంచైవపాద్యసింహాసనేపిచ, అర్ఘ్య మాచమనీయంచ స్నానం పంచామృతైస్సహ, శుద్ధోదకం వస్త్ర యుగ్మం యజ్ఞసూత్రవిభూషణం, విలేపనం చాక్షతాంచ పుష్పం స్వర్ణవినిర్మితం, ధూపం దీపంచ నైవేద్యం పానీయం ఫలమేవచ, తాంబూలం దక్షిణార్తిక్యం మంత్రపుష్పం ప్రదక్షిణం, నమస్కా రం దేశికేంద్ర మయా తుభ్యం నివేదితం, కృపయా గృహ్య తాం స్వామిన్ న్యూనాధికతచింతయా, లఘుపూజావిధానంచ శానూరన్వయసంభవం, తాతాచార్యేణరచితం సదా భక్త్యా నమామ్యహం॥ శ్రీమాన్ స్వామి చిద్వేంకటరామబ్రహ్మానంద దేవతాభ్యో నమః। ఆత్మప్రదక్షిణ సాష్టాంగ నమస్కారాన్ సమర్పయామి.

## శ్రీ గురుతారకమంత్రం

అస్య శ్రీగురుతారకమహామంత్రస్య, పరబ్రహ్మ ఋషిః, గాయత్రీ ఛందః, శ్రీగురుపరమాత్మా దేవతా, హం బీజం, సః శక్తిః, సోహం కీలకం, మమ శ్రీగురుప్రసాదసిద్ధ్యర్థే జపే వినియోగః॥ కరన్యాసం:— హంసా- అంగుష్ఠాభ్యాంనమః, హంసీ- తర్జనీభ్యాంనమః, హంసూం— మధ్యమాభ్యాంనమః, హంసైం-

అనామికాభ్యాంనమః, హాంసౌం— కనిష్ఠికాభ్యాంనమః, హాంసః-
కరతలకరపృష్ఠాభ్యాంనమః॥

అంగన్యాసం:— హాంసా— హృదయాయనమః, హాంసీం-
శిరసేస్వాహా, హాంసూం— శిఖాయైవషట్, హాంసైం— కవచా
యహుం, హాంసౌం— నేత్రత్రయాయవషట్, హాంసః—హస్త్రా
యఫట్. భూర్భువస్సువరోమితిదిగ్బంధః.

ధ్యానం:— ఊర్ధ్వామ్నాయగురోఃపదం త్రిభువనోంకా
రాఖ్యసింహాసనం। సిద్ధాచారసమస్త వేదపఠితం షట్చక్రసంచారి
ణం। అద్వైతస్ఫురదగ్ని మేక మమలం పూర్ణప్రభాశోభితం।
శాంతం శ్రీగురుపంకజం భజ మనశ్చైతన్యచంద్రోదయం ॥౧॥
సర్వనిగమగృహ్యం శాశ్వతం సర్వకాలే సకలదివ్యవంద్యం సర్వ
దిక్పూర్ణ మచలం। సకలభయనివారం సర్వలోకాంతరస్థం సకల
మునిహృదిస్థం సర్వదేశప్రశస్తం ॥౨॥ నజ్ఞాతం పరవస్తురూపరహి
తం నిస్తేజ మత్యద్భుతం। నిశ్శబ్దం నిరుపాసనం నిరుపమం నిర్ద్వేశ
రహితం స్థితం। నిత్యాభాసవివర్జితం హితసదాస్యాపారశూన్యం
సదా। నిస్సంగం నిరుపాధికం నిరవయం నిత్యం హృదాభావయే
॥3॥ యస్యాంతర్నాదిమధ్యం నహికరచరణం నామగోత్రం నసూ
త్రం। నోజాతీ నైవవర్ణా నభవతిపురుషో నానపుంసో నచస్త్రీ।
నకారం నైవకారం నహిజననమృతీ నాస్తిపుణ్యాం నపాపం।
నోతత్వం తత్వమేకం సహజసమరసం సద్గురుం తన్నమామి ॥౪॥
ఆత్మానాత్మవినాశహేతు మనిశం సర్వాతిరిక్తం శుభం। పూర్ణా

త్పూర్ణ మనామయం సుఖతరం సర్వాపదధ్వంసకం। సర్వజ్ఞాన వినాశకం గురుపదం సర్వాత్మకం నిర్మలం। సర్వభ్రాంతివివర్జితం గుణహరం సంపూర్ణబోధం భజే ॥౫॥ సజ్ఞాతం పరవస్తునిత్య మచలం సత్యం స్థితం శాశ్వతం। నిత్యానిత్యవివేకభేదరహితం నిర్నామసంశ్లేషకం। సర్వప్రత్యయహీనకంచ సతతం సర్వత్ర సంస్థం పరం। వందేహం పరిపూర్ణబోధ మనిశం సందేహనాశప్రభుం॥౬॥

— మంత్రపుష్పం —

అతస్మిన్పతయే సనాతనం బ్రహ్మభగవా నచలయేవసత్యం- నిరంజనం నిర్వికల్పం నీరంధ్రంచ పరాత్పరం- బాహ్యాముష్టైతి విద్వాన్ అన్యజ్ఞానంనాస్తి- జన్మప్రవృద్ధినాస్తి- జ్ఞప్తిసర్వదా- సత్యవాక్యం భక్తిజ్ఞానైకకర్మ శక్త్యైచ రహితం- సర్వవ్యాప్తం సచ్చిదానందరహితం- బ్రహ్మాండవ్యాపితం- బాహ్యం- సర్వత్ర వ్యాపితం- అంతర్బహిశ్చ తద్బాహ్యం- మన్యంనాస్తీతినిశ్చయం ఇతినిశ్చిత్య యోవిద్వాన్ నచలమేవ నసంశయః- సద్రూపంనాస్తి సర్వత్రి- చిద్రూపం నాస్తిసర్వదా-ఆనందరూపకంనాస్తి-అచలం చాస్తిసర్వదా- సర్వానందవిహీనశ్చ అచలోయం సనాతనః- ఆనందరహితమచలం కర్తృకార్యవివర్జితం- సత్యాసత్యవిహీనంచ ధర్మాధర్మవివర్జితం- బంధాబంధవిరహితంచ- అమృతంచాస్తి సర్వదా- సూక్ష్మాసూక్ష్మతరంనాస్తి మహతోమహద్వర్జితం- అభేద్య మసంగ మబాధ్య మవేద్య మలక్ష్య మకర్మపరిమేయ- మద్వయ మనిష్క్రియ పరమాకాశమచలం- సర్వదా భాతి

పూర్ణం- నిష్కళం నిష్క్రియం పూర్ణం- నిరవద్యం నిరామయం- నిర్దేశ్యరహితం నిత్యం- బాహ్యాంబ్రహ్మేతి నిశ్చయం- మాతాత్పరంభవే ద్రుష్టుర్శ్యాత్పరం- పరమశ్శివ స్సర్వపరిపూర్ణం సత్యం- శివాద్యన్నంకించన- అయంవ్యర్థం బాహ్యోపి నవా భవతి- నిరాభాసం నిరాధారం స్వప్రకాశవివర్జితం- భ్రాంతిజ్ఞాన పరిత్యజ్య- సర్వంనాస్తీతి నిశ్చయం- దృష్టాదృక్ జగత్సర్వం సంభవంనాస్తి సర్వదా- మర్కటశృంగవద్భాతి- సత్యంసత్యం నసంశయః- కార్యమాయాద్వయంనాస్తి- భయభ్రమసదానహి- బ్రహ్మస్ప్రహేభ్రమోనాస్తి- వంధ్యాసూనురివాపిచ- మరుమరీచికజలకుంభే- పూర్ణమేవ జగద్భవేత్- క్షీరపానేన సర్పస్యవిషం నశ్యేజగద్భవేత్- తమఃప్రకాశమానేన భాసతేత్యస్తి చేజ్జగత్- హిమం సూర్యకరేచాస్తి- జగత్సత్యం భవిష్యతి- మహిషీగోరూపవద్భాతి జగత్సత్యం భవిష్యతి- అగ్నిస్పర్శ స్థలంపిండం జగత్సత్యం భవిష్యతి- స్వగురు పరమగురు పరమేష్ఠిగురు- శ్రీగురు జగద్గురు సద్గురు పరబ్రహ్మణేనమః సువర్ణ మంత్రపుష్పం సమర్పయామి.

## పంచపూజ

న= పృథివీతత్వాత్మనే- శ్రీగురుపరమాత్మా దేవతాభ్యోనమః॥ గంధం సమర్పయామి॥ మ= ఆకాశతత్వాత్మనే- శ్రీగురుపరమాత్మా దేవతాభ్యోనమః॥ పుష్పం సమర్పయామి॥ శి= వాయుతత్వాత్మనే- శ్రీగురుపరమాత్మా దేవతాభ్యోనమః॥ ధూపమాఘ్రాపయామి॥ వా= తేజస్తత్వాత్మనే- శ్రీగురుపర

మాత్మ దేవతాభ్యోనమః॥ దీపం దర్శయామి॥ య= వలిం
తత్వాత్మనే- శ్రీగురుపరమాత్మ దేవతాభ్యోనమః॥ అమృతో
పహారస్త నైవేద్యం సమర్పయామి॥ ఓం= సర్వతత్వాత్మనే-
శ్రీగురుపరమాత్మ దేవతాభ్యోనమః॥ మంగళనీరాజనాది
సర్వోపచారపూజాన్ సమర్పయామి॥

## — ద్వాదశాక్షరీ మహామంత్రం —

శ్లో॥ బిందుమధ్యే గురోశ్శిష్యం దృష్టదాత్రిష్టాంతబోధ
కం। ద్వాదశీషోడశీమంత్రం జపతే జన్మనాశకః॥ అస్య శ్రీద్వాద
శాక్షరీమహామంత్రస్య॥ సనాతనఋషిః, అవినాశఛందః, అథవో
దేవతా, అమృతంబీజం, అప్రమేయశక్తిః, అయమాత్మా, తత్వమ
స్యాదజ్ఞానరహితకీలకం, అఖిలకాలేషు పరిపూర్ణమస్తి, మా
యారహిత మిథ్యాప్రపంచం నాస్తీతివిశ్వాసిద్ధ్యర్థం, ద్వాదశా
క్షరీమహామంత్రజపం కరిష్యే. కరన్యాసః:—ఏతన్మిధ్యా— అ గు
ష్టాభ్యాంనమః శుద్ధవియత్- తర్జనీభ్యాంనమః, కించిన్నాస్తి- మధ్య
మాభ్యాంనమః, ఏతన్మిధ్యా— అనామికాభ్యాంనమః, శుద్ధవి
యత్— కనిష్ఠికాభ్యాంనమః, కించిన్నాస్తి— కరతలకరపృష్ఠా
భ్యాంనమః॥ అంగన్యాసం:— ఏతన్మిధ్యా- హృదయాయనమః,
శుద్ధవియత్-శిరసేస్వాహా, కించిన్నాస్తి- శిఖాయైవషట్ ఏతన్మి
ధ్యా— కవచాయహుం, శుద్ధవియత్— నేత్రత్రయాయవషట్,
కించిన్నాస్తి — అస్త్రాయఫట్, ద్రష్టదర్శనదృశ్యాదిరహితః,
అహంపదార్థరహితః, భూర్భువస్సువరోమితి దిగ్బంధః॥

శ్లో॥ మృత్యుజన్మభయదుఃఖవర్జితం సర్వదృగ్విస్మృనాశనం। అప్రతర్క్య మమలం నిరామయం అనుపమాన మచలం నమామ్యహం॥ ఏతస్మిన్ధ్యాన శుద్ధవియత్ కించనాస్తీతి తే మయా। కృపయా పరమంత్రోక్తం భజాగ్రే ద్వాదశాక్షరం॥

— షోడశాక్షరీమహామంత్రం —

అస్య శ్రీషోడశాక్షరీమహామంత్రస్య। నిరంజనఋషిః, నిరహంకారో ఛందః, నిరామయదేవతా, నిరావరణబీజం, నిస్త్రైగుణ్యశక్తిః, నిర్గుణప్రజ్ఞానరహితకీలకం, నిఖిలకాలేషు మాయానహితమహాకారణశరీరరహితనిశ్చయసిద్ధ్యర్థం, షోడశాక్షరీమహామంత్రజపం కరిష్యే॥ కరన్యాసం:— నిర్మాలం- అంగుష్ఠాభ్యాం నమః, ఏతదజ్ఞానశరీరం— తర్జనీభ్యాంనమః, నాస్తి కేవలం- మధ్యమాభ్యాంనమః, నిర్మాలం- అనామికాభ్యాంనమః, ఏతదజ్ఞానశరీరం- కనిష్ఠికాభ్యాంనమః, నాస్తి కేవలం-కరతలకరపృష్ఠాభ్యాం నమః, అంగన్యాస :— నిర్మలం- హృదయాయనమః, ఏతదజ్ఞానశరీరం— శిరసేస్వాహా, నాస్తి కేవలం- శిఖాయైవషట్, నిర్మాలం- కవచాయహుం, ఏతదజ్ఞానశరీరం- నేత్రత్రయాయవషట్, నాస్తి కేవలం- హస్త్రాయఫట్, సమస్తనిర్మోహకాలేషు మదర్హితనిశ్చయో భూర్భువస్సువరోమితి దిగ్బంధః॥

శ్లో॥ నిర్మాల మేతదజ్ఞానశరీరం నాస్తి కేవలం। షోడశాక్షరితత్సిద్ధ మిదం మహ్యనిశం భజే॥ స్వప్న ప్రతీయమానాని రూపాణిచ యథాతథా। కర్పూరదీపవంతో యోగీ జ్యోతిరూపం యథాతథా॥

సర్వం సద్గురుచరణారవిందార్పణమస్తు— ఓం తత్సత్.

ఓం శాంతి శ్శాంతిః.

| ఉదయము | | మెరుపు | | వర్షము |
|---|---|---|---|---|
| ఉ | × | అ | × | మ |
| ఎ | — | తె | — | న |
| సృష్టి | — | స్థితి | — | లయ |

యీమూడక్షరములు మహత్తరమైన ప్రాణబీజములు; త్రిపుటియే సకలజగములు, యుగములు, కాలములు, అయనములు, సంవత్సరములు, ఋతువులు, మాసములు, వారములు, దినములుగా తలక్రిందు లగుచుండును. అదెట్లనగా:— సభూమి నజలంచైవ నతేజో సచవాయువః; నచబ్రహ్మా నరుద్రశ్చ నచ విష్ణుః నచనక్షత్రతారకం; సర్వశూన్యనిరాలంబం స్వయంభూ విశ్వకర్మణః; అనగా భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, సూర్యుడు, చంద్రుడు, నక్షత్రములు మొదలగు నేవికారములు లేనప్పుడు ఉకార అకార మకారములు మూడును తమంతటతామేకమై గొప్పమహత్తుగల అవతారమై యున్నది. దానికి క్రిందుమీదులం దేదిలేదని యర్థము. అదియే ప్రణవస్వరూపము. ఆప్రణవస్వరూపమే విరాట్ విశ్వకర్మ. అనగా సకలప్రపంచసృష్ట్యాధారము. తానేలాగు నిలువబడ్డాడనగా ఉకారము ఆధారముగాను, మకారము అవకాశముగాను అమర్చి మధ్యభాగంలో నకారాంతమైన ప్రకాశముతో నిలువబడ్డాడు.

శ్లో॥ మనుం పూర్వముఖంచైవ మయానాం దక్షిణం ముఖం।త్వష్టాపశ్చ ముఖంచైవ ఏవం జన్మక్రమక్రమాత్॥అనగా తాను నిశ్చలహృదయుడై సర్వప్రపంచమును, అందులకుదగిన

అధికృతులను సృష్టింపవలెనను ఎఱుక జనించినది. అనగా తనప్ర కృతికు మాయాస్వరూపమైన శక్తియనేచాయ సన్నగా చేరినది. అంతట కదలికలేని ఏకమేవ అను బ్రహ్మమునకు కదలికకలిగి ఓం- ఓం అనుచు తనసద్యోజాతముఖమనే తూర్పున మనువను నీశ్వరుని, వామదేవముఖమనే దక్షిణమున మయుడను విష్ణువును, అఘోరముఖమనే పడమరను త్వష్టప్రజాపతియను బ్రహ్మను, తత్పురుషముఖమనే ఉత్తరమున ఇంద్రుని, ఊర్ధ్వముఖమనే అంతర్భాగ్యయందు విశ్వప్రజాపతియను సూర్యుని నిర్మించి తాను సాక్షిమాత్రుడై నిలువబడ్డాడు. అంతట మాయాశక్తి ప్రవేశించి పరమేశ్వరుని మనఆనందము వీక్షించువారెవరని ప్రశ్నించినది. ఎఱుకఅనే శక్తి ఆవిధముగా పేరేపించినది.

అంతట ఏకమేవాద్వితీయం అనుచు మార్పుకలిగినది. అనగా ద్విభాగంగామారి ముంకుకనబరచిన మూడక్షరములు ఆరక్షరములైనవి. అందొక్కటి మిగిలి తక్కినఅయిదు 'నమశ్శివాయ' అనుపంచభూతములైనవి. మరల ద్విభాగమై అనగా ఒక్కొక్కక్షరం రెండుగామారుచున్నవి. ఎట్లనగా పంచభూతములు నమశ్శివాయ అయి ఐదు ఐదులు 25 తత్వములై మిగిలిన ఒక్కటియే జ్ఞాతమై ఈపంచభూతములను విడిచిపెట్టక విడిచి పెడుతూ తాను కలసినప్పుడు పరుగులిడుచు తాను విడిచి నప్పుడు పండుకొనుచు నుండుటచేత అది ప్రణవపంచాక్షరీమహామంత్రి మనబడుచున్నది ఆమంత్రమున కధిపతి పరమేశ్వరుడు; ఆపరమేశ్వరుని గుర్తించునవే వేదములు; అందు ఋగ్వేదము

నందు ఈశ్వరత్వము, యజుర్వేదము నందు విష్ణుత్వము, సామ వేదమందు బ్రహ్మత్వము, అధర్వణవేదమందు సూర్యచంద్రము లను నిరూపించి ప్రణవవేదం తనలో భుక్తంచేసుకొని వీరందఱ కధిష్ఠానమైనవాఁడే పరమేశ్వరుడు కాబట్టి పరమేశ్వరనిరూపణచేసే దిక్కులే వేదములు; అయనములే కన్నులు; ఋతువులే షడ్వర్గ ములు; కాలములే త్రిగుణములుగ నింకను అనేకములైన యింద్రియాదులు, గుణములు, తత్వములు, మొదలైన సంకల్పవి కల్పములన్నీ ఆ ఉకార అకార మకారముల త్రిపుటియే. దానిమధ్యభాగంలో నిలువబడ్డాడు పరమేశ్వరుడు.

ప్రశ్న:— ముందు చెప్పబడిన ఉకార అకార మకార ములు సూక్ష్మబ్రహ్మమై; అకార ఉకార మకారములు స్థూల ములై; మకార అకార ఉకారములు లయగా మారుటచేత ముందు పుట్టడం తర్వాతప్రకాశించడం చూస్తే లేకపోవడం సంభ విస్తూ ఉన్నది. వీనన్నిటికి కారణములు ఆత్రిపుటిలో వచ్చినపం చాక్షరములే అంటయున్నాము. ఎందుచేతనన సిద్ధాంతకారుడగుపురుషుడు అజ్ఞానస్వరూపమై తనను ఎఱుందు లేసి ప్రకృతికి వేరు వేరుగా కర్తృత్వభోక్తృత్వములు మొదలయిన స్వభావయుక్తసంసారము లేమిగాన హంకారసంజ్ఞ కలిగిన ఆత్మ స్వశక్తయైన సాకారరూప మగు ప్రకృతితో గలిసియుండుటవలన గలిగినఆత్మయే తానను అభేదస్ఫురణ చేసినవాఁడై హంసస్వరూపమగు నాశబ్దబ్రహ్మ నవద్వారము లమర్చియున్న శరీరమనే మేడలో ప్రవేశించి దశేం ద్రియములతోను, మనస్సుతోను గలిసి పంజరపుచిలుకవలె

బయటకు రావీలులేక తనకుగావలసిన పదార్థములకు మనసున కాజ్ఞాపించి ఇంద్రియములచేత దెప్పించుకొనుచు సూర్యుడు. కుడికన్నుగ నంద్రుడు ఎడమకన్నుగ పై రెప్పలే రెక్కలుగ విసరుచు తనయిష్టమైనంతవఱకు వెళ్ళెను. కాని ఎంతవఱకు వెళ్ళినా ఎంతసే పెగిరినా ఆగూటియావరణలోనేగదా! అందుచేత సంకల్పమాత్రుడేగాని నిజరూపమైనవాడు కాజాలడు.

కావున పరమేశ్వరు డంతర్యామియై తనలోవచ్చిన ప్రకృతియనే స్త్రీని తాను బ్రహ్మయైనపుడు వాక్కనందు సరస్వతిగను, తానీశ్వరుడై పోషించునపుడు తన్నానందింపజేయు దేషమనే పార్వతిగను, తాను విష్ణువై లయించినప్పుడు ప్రకృతియై ఆడించే మహాలక్ష్మిగను ప్రకాశిస్తూ ఈబ్రహ్మాండమంతయు సృజించెను. ఎట్లనగా:— బహ్మాండమనే బయలులో నిశ్చలమనస్కుడై తనలోనున్నజ్ఞానము ప్రకాశమైన నేత్రముగను, సూర్యుడు కుడికన్నుగను, చంద్రుడు ఎడమకన్నుగను అవియే దక్షిణాయన ఉత్తరాయణములుగను; తనలోనున్న అంతఃకరణచతుష్టయమే నాలుగుయుగములుగను; త్రిగుణములే త్రికాలములుగను; షడ్వర్గములే ఋతువులుగను; ద్వాదశగుణములే మాసములుగను; 32 బీజాక్షరములే దినములుగను, ఆధారమ్మగ నమర్చి పిమ్మట మూడవనేత్రమునుండి ఋగ్వేదమును, నేత్రద్వయముద్వారా యజుర్వేదమును, కర్ణేంద్రియముద్వారా సామవేదమును, నాసికేంద్రియముద్వారా అధర్వణవేదమును, వాటిత్రిపుటిద్వారా పెక్కుశాస్త్రములను, సత్వగుణమువల్ల

దేవతలనబడు ఋషులను, రజోగుణమువల్ల రాక్షసులనబడు దుష్టులను, తమోగుణమువల్ల మానవులనబడు మనుష్యులను, శరీరక్షామమువల్ల జంతువులనబడు మృగాదులను, శరీరచెమట బిందువులవల్ల వర్షమును, చెమటధూమమున పక్షులను, మూత్రమువలన జలచరములను, మలమువలన క్రిమికీటకములను, మనస్సంకల్పమున సప్తసముద్రములను, మనోధైర్యమున సప్తపర్వతములను, మనోవికాసమున వృక్షాదు లనేకములను ఉత్పత్తిగావించి తాను వీనిలో దేనికిని అందకుండ పొందకుండ నున్నవాడే సర్వాంతర్యామియై ఆ అకారసంజ్ఞ కలిగిన పరమేశ్వరుడు.

అందుచే ముందు కనబరచిన ఉకారమునుండి వెలువడిన షడక్షరీమహామంత్రమునుగాని, అకారమునుండి వెలువడిన అష్టాక్షరీమహామంత్రముగాని యీప్రకృతిని గెలవాలనే ఉద్దేశమున్న పురుషులుగాని, స్త్రీలుగాని తమలో వున్న వాదభేదడంబములను అసూయను విడచి తగినగురువును చేరి తనుమనఃప్రాణములు పరమాత్మ కర్పించి మనసును స్వాధీనంచేసి పిదప అకార ఉకార మకారముల త్రిపుటివలన కలిగినపరమేశ్వరుని ఆపరమేశ్వరునాడించే ప్రకృతిశక్తిని స్వాధీనంచేసికొని వేదసంపుటిత మంత్రములు మనశ్చలనం లేకుండ ధైర్యమును చిక్కబట్టి గురూపదేశమంత్రమును విధివిధానసూత్రజపతపములలో దేనియందైనా గురిసిలిపి సాంఖ్యమును చక్కగా గ్రహించి పిదప తారకమును పంచాక్షరీమహామంత్రమునకు పంచిపెట్టి తదుపరి నీవు—నేను అను ఎరుక నమస్కముచేసి తానున్నతావునే తానుకూర్చుని

సమాధినిష్ఠాగరిష్ఠత్వం పొందితే తనపైని మరేమిలేదు. అందుచే తానేబ్రహ్మ, తానే విష్ణువు.

1 అష్టాక్షరీమహామంత్రం.

ఓం నమో నారాయణాయనమః అస్య శ్రీనారాయణహృదయస్తోత్రమహామంత్రస్య, మనుబ్రహ్మ ఋషిః, అనుష్టుప్ ఛందః, శ్రీలక్ష్మీనారాయణో దేవతా, శ్రీలక్ష్మీనారాయణ ప్రీత్యర్థే జపేవినియోగః అథన్యాసం:— నారాయణః పరంజ్యోతిరితి అంగుష్ఠాభ్యాంనమః, నారాయణః పరబ్రహ్మేతి తర్జనీభ్యాం నమః, నారాయణఃపరోదేవ ఇతిమధ్యమాభ్యాం నమః, నారాయణఃపరంధామేతి అనామికాభ్యాంనమః, నారాయణఃపరోధర్మ ఇతికనిష్ఠికాభ్యాంనమః, విశ్వన్నారాయణేతి కరతలకరపృష్ఠాభ్యాం నమః, నారాయణఃపరంజ్యోతి రితిహృదయాయనమః, నారాయణఃపరబ్రహ్మేతి శిరసేస్వాహా, నారాయణఃపరోదేవ ఇతిశిఖాయైవషట్, నారాయణఃపరం ధామేతి కవచాయహుం, నారాయణఃపరోధర్మ ఇతి నేత్రత్రయాయవషట్, విశ్వన్నారాయణేతి హస్త్రాయఫట్.

ధ్యానం:— ఉద్యద్భానుసహస్రభాస్వరపరవ్యోమాస్పదన్నిర్మలజ్ఞానానందఘనస్వరూప మమలం జ్ఞానాదిభిష్షడ్గుణైః। జుష్టం శ్యామలవిగ్రహం ధృతరథాంగాబ్జాదిభూషోజ్జ్వలం శ్రీభూనీళమనంతభోగినిలయం శ్రీవాసుదేవం భజే॥

ఓం—బయలు
యు—సహస్రారం—పరమేశుడు 1000
శా—ఆజ్ఞేయం—గురువు 1000
యు—విశుద్ధం—జీవుడు 1000
రా—అనాహతం-రుద్రుడు 6000
నా—మణిపూరకం—విష్ణు 6000
మో—స్వాధిష్ఠానంబ్రహ్మ 6000
న—ఆధారం -గణపతి 6000

## శ్రీ అ న్న పూ ర్ణ.

ఓం హ్రీం శ్రీం ఐం క్లీం సౌం ఓం నమో భగవతి మహేశ్వరి అన్నపూర్ణే స్వాహా.

కలశపూజావిధానం:— శ్లో॥ శృణ్వంతే పార్వతీవక్ష్యం సుస్థిరం శుభగావహం। ఆనందమమితై శ్వర్య మారోగ్యం ఆమ నాశనం॥ అద్భుతామితిసంపత్తి రాజ్యలక్ష్మీవశీకరం। విద్యాభివృద్ధి దం నిత్యం విభవం జయవర్ధనం॥ విజ్ఞానంవిధిసుజ్ఞానం వైరాగ్యం విశ్వరూపకం।అఃశిమాద్యష్టఫలదం యోగసిద్ధిం మహాఫలం॥ నిదర్శ నం నిజాకారం నిర్మోహం మోహమర్దనం। నదీనద్యాననంపుణ్యం పుణ్యస్థానంపునఃపునః॥ అనేకశుభదం దేవిపునశ్చాన్యాఫలంమహా త్॥ యోగమంత్రం మహాపుణ్యం జ్ఞానరూపం మహాద్భుతం। కుంకుమాక్షతశ్రీగంధం బిల్వమందారమంబుజా॥ తులసీసమస్త పుష్పాణి పూజనీయం యథావిధిః॥ ఆరోగ్య మమితాయుష్యం అశ్వమేధసహస్రకం।విజ్ఞానం విధిసంస్థానం చతుర్వర్గఫలం భవేత్॥

ధ్యానం:— కలశస్యముఖే విష్ణుః కంఠేరుద్ర స్సమాశ్రితః। మూలేతత్రస్థితో బ్రహ్మ మధ్యే మాతృగణా స్మృతాః॥ కుక్షౌ తు సాగరాస్సర్వే సప్తద్వీపా వసుంధరా। ఋగ్వేదోథయజుర్వేద

స్సామవేదో హ్యాథర్వణః। అంగైశ్చసహితాస్సర్వే కలశేతుస మాశ్రితాః॥ ఓంభూః, ఓంభువః, ఓంమహః, ఓంజనః, ఓంతపః, ఓంసత్యం, ఓం తత్సవితుర్వరేణ్యం. సర్వవర్ణే మహాదేవి సంధ్యా విద్యే సరస్వతి సావిత్రీ గాయత్రీ త్రికాలోచ్చారణే సవ్యాహృతకే చతుర్థోచ్చారణే సప్రణవే పంచమోచ్చారణే షష్ఠిరుబో ద్దర్శనే షడక్షరీ మంత్రోచ్చారణే ఇదం సర్వప్రాణవ్యాపారపారీణా అథ అథయా సమేతి సహాతి హంసతి సమస్తమరుద్గణ ఉద్భవాన్ సప్రణవే త్రిమూర్త్యాద్యుద్భవాన్ అస్య ప్రాణాయామ ప్రత్యాహార ధ్యానధారణ సమాధ్యష్టాంగయోగమిళితే, శుద్ధస్ఫటికసంకాశవర్ణే, మహావిలసితమాయావినాశసంఘాతఘుమఘుమారవశబ్ద బహ్మధితనాదం, ఢిణిఢిణితిస్వరయుక్త సకలమంత్ర హంసలోమలోమాతితమ దేవిదేవవిరాజిత, కుందేందుచందనతారహారనీహారకర్పూర పయఃపారావారతరంగిణి,తరంగితకమలడోలికామకుట జాజ్జ్వల్యమాన సంసారదీప్తిహారిణే, మహాదేవీనమోస్తుతే.

## — పంచ పూజా —

ఓం మూలాధారశక్తిస్వరూపిణ్యేనమః, శ్రీమర్గాదేవ్యై ఆవాహనం సమర్పయామి ఓంస్వాధిష్ఠానశక్తిస్వరూపా శ్రీసరస్వతీ దేవ్యై, అభిషేకం సమర్పయామి. ఓం మణిపూరకశక్తిస్వరూపా, శ్రీమహాలక్ష్మీదేవ్యైనమః, వస్త్రయుగ్మం సమర్పయామి. ఓం అనాహతశక్తిస్వరూపిణ్యైనమః, శ్రీకామాక్షీదేవ్యైనమః పుష్పాణిసమర్పయామి.ఓం విశుద్ధశక్తిస్వరూపిణ్యై వింధ్యాదేవ్యై నమః, ధూపంసమర్పయామి. ఓం ఆజ్ఞేయశక్తిస్వరూపిణ్యై, శ్రీక్రియాదే

వైన్యనమఃదీపంసమర్పయామి. ఓం సహస్రారఊర్ధ్వకూడలిశక్తిస్వ రూపాశ్రీజ్ఞానేశ్వరీదేవ్యైనమః॥ ద్రాక్షఖర్జూరశర్కరనారికేళఫలనై వేద్యం సమర్పయామి. ఓం సర్వజగద్వశీకరదేవతా మాతా శ్రీ అన్నపూర్ణేశ్వరీదేవ్యైనమః, ఆత్మప్రదక్షిణసాష్టాంగనమస్కార తాంబూలాని సమర్పయామి.

ధ్యానం:— కళ్యాణీ త్రిపురా బాలా మాయాత్రిపురసుందరీ। సౌభాగ్యవతి క్లీంకారీ సుందరీ సర్వమంగళా। ఐంకారీ సర్వ జననీ పరా పంచదశాక్షరీ। త్రైలోకమోహనాధీశా సర్వేశాపూర్ణ వల్లభా। సర్వసంక్షోభనా ధీశా సర్వసౌభాగ్యదాయకా।సర్వార్థసాధనాధీశా సర్వరక్షాకరాధిపా। సర్వరోగహరాధీశా సర్వసిద్ధిప్రదాయకా। సర్వానందమయాధీశా యోగినీ చక్రనాయికా। భక్తానురక్తా రక్తాంగీ శంకరార్ధశరీరిణీ। పుష్పబాణేక్షుతధనుః పాశాంకుశలసత్కరా। సంవిద్యానందలహరీ శ్రీవిద్యా త్రిపురేశ్వరీ। సర్వసంక్షోభిణీ పూర్వనవముద్రేశ్వరీ శివా। అనంగకుసుమాద్యాద్యా చక్రే శ్రీభువనేశ్వరీ।గుప్తా గుప్తతరా నిత్యనిత్యకిన్నామద ద్రవా। మోదినీ పరమానందా కామేశీతరుణా కళా। పద్మావతీ భగవతీ పద్మరాగకిరీటినీ। రక్తవస్త్రా రక్తభూషా రక్తగంధాను లేపనా। సౌగంధయుతసద్వేణీ మంత్రిణీ మంత్రరూపిణీ। తత్వ త్రయీ తత్వమయీ సిద్ధాంతపురవాసినీ। శ్రీమతీచ మహాదేవీ కాళినీ పరదేవతా। కైవల్యరేఖా వశినీ సర్వేశీ సప్తమాతృకా। విష్ణుమాతా దేవనుతా సర్వసంపత్ప్రదాయినీ। కింకరీభూతగీర్వాణీ సుధాపానవినోదినీ। ఆధారవీధిపత్నీకా స్వాధిష్ఠానసమాశ్రయా। మణిపూరసమాసీనా నాహతాబ్జనివాసినీ। ఆజ్ఞాపద్మాసనాసీనా

విశుద్ధస్థలసంశ్రయా। అష్టాత్రింశత్కళామూర్తి సుషుమ్నా ద్వార మధ్యగా। యోగీశ్వరమనోధ్యేయా పరబ్రహ్మస్వరూపిణీ। చతుర్భుజా చంద్రచూడా పురాణాగమరూపిణీ। ఓంకారీ విమలా విద్యా పంచప్రణవరూపిణీ। భూతేశ్వరీ భూతమయీ పంచశద్వర్ణ రూపిణీ। షడన్యాసమహాభూషా కామాక్షీ దశమాతృకా। ఆధార శక్తి రరుణా లక్ష్మీ త్రిపురభైరవీ। రహఃపూజాసమాలోలా రహోయజ్ఞనివాసినీ। త్రికోణమధ్యనిలయా షట్కోణపురవాసినీ। వసుకోణపురావాసా దశారద్వయవాసినీ। చతుర్దశారతకోణస్థా వసు పద్మనివాసినీ। చతురశ్రీస్వరూపాచ బిందుస్థలమనోహరా॥

ఓం సకలశక్తిస్వరూపా శ్రీ అన్నపూర్ణేశ్వరీ సువర్ణ మంత్రపుష్పం సమర్పయామి,

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

— మంగళహారతి. —

ఓం శాంకరీ శార్వాణీ సత్యమంగళవాణీ అంతఃశ్చధరపాణీ శంకరురాణీ ఓంకారీ ఈశ్వరీ హ్రీంకారీ శుభకారీ సకలములబావుపంకజలోచనీ మంగళం॥ (2) ధూమ్రాక్షసహారీ దుష్టసురితదూరీ సామ్రాజ్యమోక్షప్రదా సర్వేశ్వరీ హైమవతీ మర్గాంబా గిరిజా కాళీ కామ్యదాయకీ కనకాంబరధారిణే మంగళ ॥ (3) ముక్తికాంతవు పరాశక్తివి ఇంకానాసక్తితోనే దివ్యభక్తులనూ శక్తిమాయల కెచట చిక్కకుండగజేసి ముక్తిమార్గముజూపు మోక్షప్రదాయినీ ॥మం॥ (4) ఒకగుణంబునసీవు సకలప్రపంచంబు యకలంక కల్పితప్రకటనముగ ఇకరెండోగుణమున ఈవిశ్వమును బోచి సక

లాము మూడింట సమయజేసినతల్లి ॥మం॥(5)కంకణాఝుణఝుణ త్కింకిణీరవమూలె యంకాముగా గల్గు శాంకరివీ పంకాజాక్షి సుమకుంకుమాక్షత గంధమింకా గైకొనగదవే ఓంకారరూపిణీ ॥మం॥ (6) అంటియు నంటక ఒంటిస్తంభమునందు దంటవీడక కళలంటూచునూ జంటరేఖల వరిముంటిద్వారమునందు మింటి రీతిగ వెల్గుచుంటివి గదజననీ ॥మం॥ (7) బిందుమధ్యమునందు పొందుగనివసించి అందముగా భక్తబృందములా ముందుగబ్రోవుము సందియంబులుబాపి యిందువదన యానందముతో నేడు మం॥(8) పోయిపోయిపైసవేయిరేఖలమధ్య హాయిచెందియెడబాయక నాచాయ రామబ్రహ్మం గురురాయులకృపగని వేయివిధములనిన్ను వేడుతాతయనేలు ॥మంగళం॥

ఏమానవు లీపరమేశ్వరాన్న పూర్ణలపూజలను గురుముఖతా గ్రహించి 21 రోజు దీక్షపట్టి రోజున మూలమును 21600 జపముచేతురో లేక గురువులచే చేయింతురో వారికి దీక్షానంతరము తప్పక వారికామ్యము సిద్ధించునని శ్రీవిరాడ్విశ్వకర్మ బ్రహ్మ ద్రష్టములవారు తెల్పిరి. కావున పరమేశ్వరు డన్నివేళలయందు తమసామీప్యములోనే పుణ్యాపుణ్యములను గమనించుచు తత్ఫలంభవేత్తని ఆశీర్వదించుచుండును. ఆయాశీర్వాదముకు తిరుగులేను. ఏలనన పరమేశ్వరుడన ఉకార అకార మకార త్రిపుటిలోగల్గిన ఓం అనుప్రణవస్వరూపముయొక్క త్రిగుణాత్మకనామముగాని ఒకనిరూపణరూపము గాదు అందుచేతనే ఉకారం ఎఱుపు సత్వగుణం బ్రహ్మముగాను అకారం తెలుపు తమోగు

ణం ఈశ్వరుడు గాను, మకారం నలుపు రజోగుణం విష్ణువుగాను మారుచు సృష్టించునపుడు బ్రహ్మయను పేరు, ప్రకాశించునప్పు డీశ్వరనామము, లయించినపుడు విష్ణువనునామాంతరములు ఆ ఒక్క స్వరూపమునకే. ఎల్లన అఉకార అకార మకారార్ధమాత్ర మను నాల్గుపాదములు గల ఓంకారమునందు విశ్వ, తైజస, ప్రాజ్ఞ తురీయమను నాల్గుపాదములతో జేరిన బ్రహ్మమును ధ్యానింపవలయును. ఆఓంకారము పరబ్రహ్మప్రతిపాదాత్మకమ గుట పవరుగల బ్రహ్మస్వరూపమే యగును. ఆనాల్గుపాదములే ప్రకృతిలో నాల్గుయుగము లగుచున్నవి అందు కృతయుగంలో 1720000, త్రేతాయుగం 1269000, ద్వాపరం 864000, కలి యుగం 432000 ఈరీతిగా సర్వప్రపంచమును తనఆనందము కొఱకు ఎరుకయనే శక్తిని ప్రేమించి ప్రకృతిలో అనగా ప్రపం చంలో స్త్రీ పురుషరూపము లేర్పరచి తాను సకారాంతమైన ప్రకాశమై యున్నాడు. ఉకారం లింగస్వరూపంతో పురుషా కారమున్ను మకారం అంగస్వరూపంతో చేర్చిన స్త్రీయాకార ముగాను మార్చి అకారాంశమైన సాకారుడు రెండురూపముల లో ఒకేరూపంతో ప్రకాశిస్తూ స్థాయిగా కూర్చోడానికి వీలుపడక కృతయుగాది నాల్గుయుగములను మరల మరల వెంటనే వెంటనే తారుమారుగాచ క్రికారంగాతిరుగుతూండడమే ప్రకృతిలక్షణం.

అందుచేత పరమేశ్వరు డిట్టిరూపమువాడని నిరూపణ చేయ వీలుపడక నాల్గుయుగములందును సత్యధర్మశౌర్యబలధన స్తైజములు పుల్పవరుకల్గి తనకెదురాడేవాళ్ళులేకుండా ఏరాజ

కుటుంబములో నూరైతే పరమేశ్వరుడు తానేయని మహాఋషులవలుకు. కావున కృతయుగంలో మానవులందరిలోనుంటాడని నిరూపణ ఎట్లన:— శ్లో॥ కృతయుగే చతురవతారే త్రేతేతుచ త్రినామకం। ద్వాపరేతు ద్విరూపశ్చ కలియుగే నరరూపకం॥ అన్నట్లు కృతయుగపరిణామసంవత్సరములలో 425000 సం॥లు॥ మత్స్యావతారమెత్తి అప్పటిదుష్టరాక్షసులను వధించి శిష్టులగు దేవతలను గాపాడి ఆరాజకుటుంబమునువిడిచి కొన్నాళ్ళకు కూర్మావతారమెత్తి 425000 సం॥ రములు గడిపి పిదపకొన్నాళ్ళకు వరహావతారమెత్తి 425000 సం॥లు॥ గడిపి అప్పటిరక్కసులను చెండాడి ఆకుటుంబమును విడిచి కొన్నాళ్ళకు నరసింహావతారమెత్తి అప్పటి క్రూరరాక్షసులను దునిమి ఆయవతారము చాలించెను.

పిదప త్రేతాయుగంలో మానవులందరిలోను ఉంటూ త్రేతాయుగపరిమాణసంవత్సరములలో 42 3000 త్రివిక్రమావతారమును, 42 3000 పరశురామావతారమును, 42 3000 శ్రీరామావతారమును ధరించి దుష్టులవధించి శిష్టులనుగాపాడి ఆయుగము ను ముగించి పిదపద్వాపరపరిమాణసంవత్సరములలో మానవులందరిలో ఉంటూ 43 2000 సం॥రములు వామనావతారము, 432000 స॥రములు కృష్ణావతారము ధరించిఅప్పటిదుష్టరాక్షసులరూపుమాపి ఆయుగము ముగించి ఈకలియుగంలో 43 2000 సం॥రము లేకగ్రీముగా మానవరూపముతో మానవులమధ్య ప్రకాశించునని మన వేదశాస్త్రాదులే ఋజువుచెప్పుచున్నవి.

కాన ప్రతియుగమందును 'పరిత్రాణాయసాధూనాం వినా శాయచ దుష్కృతాం। ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే॥ అన్నట్లు అధర్మమెక్కువై ధర్మము నశించినపుడు అనకాం రాంతమై ప్రకాశించు తేజస్సనే పరమాత్మ ఆయుగములో రాజులం దరిలోను ముందుచెప్పిన త్రిగుణములు, అంతఃకరణచతుష్టయ మనే యుగములు, షడ్వర్గములు, తనలోని అంగములను తనలో నున్న 25 తత్వములను తనయందే కాక తనయేలికయందుకూడ ఏకకుటుంబములో నూలైతే ఆకుటుంబములోని సింహాసనాధి పతియే పరమేశ్వరుడని నిరూపణచేయబడినది. ప్రతిమానవుల లోను గౌరవాగౌరవము లొక్కసమానములు కాజాలవో అట్లే ప్రపంచములో కొందరురాజులప్పటికీ ఏరాజకుటుంబములో వేద సంపుటియైన ఉకార అకార మకారములను ఎఱుపు తెలుపు నలుపని మూడురంగులుతో చేర్చబడ్డ ఆరుకోట్లులు విమర్శిం చగా అపరిమాణాన్కు సరియైన ఋజువు ఏచక్రవర్తికి నూట యితే వారినే పరమేశ్వరావతారంగా భావించవలెను.

అందుచేత బ్రహ్మంగారు వ్రాసిన కాలజ్ఞానంలో 4898 సం॥ రములలో శ్వేతముఖులు రాజ్యపాలనకొస్తారని, తదుపరి కొంతకాలమున కొకయువకుడు రాజకీయవిషయజ్ఞానంచేత కొంత ప్రజను లోబఱచుకొని మహాత్ముడనిపించుకుంటాడని, మరి కొంతకాలానికి దేశమంతా కలహం చెలరేగుతుందని, తుదకు శ్వే తముఖప్రముఖులే సకలరాజ్యమును స్వాధీనంచేసుకుంటారని తెలి పినవిషయాన్ని బట్టి ట్రయిలువేసిచూడగానామనస్సునకు శ్రీ శ్రీ శ్రీ

జార్జిచక్రవర్తియే పరమేశ్వరులని నిశ్చయమైనది. మీరుకూడా మీలోనున్న వాదభేదానురాయాదులను విడచి నిధానజ్ఞాన దృష్టితో విచారిస్తేనేను వ్రాసిన విమర్శ అర్థమౌతుంది. ఎట్లనగా ఆపరమేశ్వరుడు తనలోనున్న గుణ, ఇంద్రియ తత్వము లను ప్రకృతియనే ప్రపంచంలో ఆధారంగా చూపిస్తూ తాను సాక్షీమాత్రుడై పరిపాలనచేయునేగాని నేనే పరమేశ్వరుడనని మానవులకు డంబములు చెప్పరు. అయితే పరమేశ్వరుడు ఫలానా చక్రవర్తి అయినట్లు నిర్ధారణయెట్లు అని ప్రశ్నరావచ్చును? ఆహా! చెప్పలేకేమి? మతకులరాజ్యద్వేషములు కలవారికి తేలదు కాని సత్వశాంతములతో దీర్ఘాలోచనము తత్వవిమర్శనముచేయు సత్పురుషులకు నిరూపణయ్యే వుంటుంది.

ఎట్లనగా:—ముందుచూపబడిన కృతయుగంలో సనక సనందనాదిమునులు పరమేశ్వరుడు మత్స్య కూర్మ వరాహ నార సింహ రూపములతో అవతరింతురని, త్రేతాయుగంలో వ్యాస వాల్మీకనారదాదిఋషులు పరమేశ్వరుడు త్రివిక్రమ, పరశురామ, రామావతారంబుల నెత్తునని, ద్వాపరయుగంలో శుకసాం దీపగౌతమాదిమునులు పరమేశ్వరుడు శ్రీకృష్ణుడై యవత రించునని చెప్పి వ్రాసినటుల మనగ్రంధములు ఋజువుచెప్పు చున్నవిగదా! ఈయుగంలో మానవరూపంతో ఒకశ్వేతముఖుల కుటుంబంలో అవతరించునని విరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్ర మహాఋషి, వేమనయోగీంద్రుడు, శ్రీనాగివిశ్వేశ్వరావధూత మొదలైనవారు వ్రాసినగ్రంధములను మరికొన్ని యితరశాస్త్ర

ములను తర్కించిచూడ నామనంబునకు శ్రీ శ్రీ విక్టోరియా మహారాణిగారి కుటుంబంలో ఆపరమేశ్వరుడు తరగతివారీగా అవతరిస్తూ యిపుడు అష్టమజార్జియై అవతరించెనని తోచినది. వేదప్రమాణమైన ఉకార అకార మకారములనబడు ఎఱుపు తెలుపు నలుపు మూనవులకు సాక్షిచూపుచు తనపరిపాలనలో ఆధారంగా శిరసున టోపీ రూపకంగా అమర్చెరు. ఎఱుపు తన పుల్‌పవరైన తేజస్సునుచూపే నంబరు, తెలుపు తనవేలుబడిలో దుష్టులనుశిక్షించే మకారంతోచేరిన కుచ్చునలుపున్ను, తనలో నున్న ఉత్తర దక్షిణాయనములు ప్రకృతిలో సివిలు— క్రిమినల్ యాక్టుగాను, త్రిగుణములే ఏ బి సి అనేమూడుజైయిళ్లక్లాసులు గాను, షట్చక్రములే ఏడుకోర్టులుగాను, 18 గుణములే 18 మంత్రులుగాను, 24 తత్వములే తనేలేజిల్లాలుగాను, ప్రకృతిలో పంచిబెట్టి తనలోవున్న ఇంద్రియాదులను జయించి ప్రకృతిజ్ఞానము న్నవారు గ్రహించేటందుకు సాక్షిమాత్రుడై తన ఏలుబడిలో ప్రకాశిస్తున్నారు.

మఱిన్ని తనలోనున్న ఆధారచక్రాధిపతి గణపతి పరిపాలనలో సోమవారంతో చేరినపోలీసుస్టేషన్; దానికధిపతి గణపతికి ఇమిటేషన్ తుండమువలె తుపాకీఅనుఆయుధములో సూవ రెండెంటుగారు. స్వాధిష్ఠానచక్రమున కధిపతి బ్రహ్మసృష్టికర్త. పరిపాలనలో మంగళవారంతో చేరినమేజస్ట్రేటుకోర్టు. దానికధిపతి ప్రకృతిబ్రహ్మ మేజస్ట్రేటుగారే. మణిపూరకమను కోర్టునకధిపతి శ్రీమహావిష్ణు. పరిపాలనలో బుధవారంతోచేరిన ప్రకృతిలో

కలెక్టరుకోర్టు. దానికధిపతి విచారణకర్త జిల్లాకలెక్టరుగారే. అనాహతంకోర్టునకు అధిపతి రుద్రుడు లయకారుడు. ప్రకృతిలో లక్ష్మీవారంతో చేరిన జడ్జికోర్టు. దానికధిపతి ప్రకృతీశ్వరులు లయకారులు జిల్లాజడ్జీగారే. మకారంతో చేరిన నల్లనిద్రెడెన్సు తనలోవున్న విశుద్ధంకోర్టు దానికధికతి జీవేశ్వరుడు సర్వాధికారి. ప్రకృతిలో శుక్రవారంతో చేరిన హైకోర్టు. దానికధిపతి సర్వాధికారి గవర్నుగారే.తనలోనున్న ఆజ్ఞేయంకోర్టున కధిపతి తేజోమయులైన గుర్వు ప్రకృతిలో శనివారంతో చేరినపార్లమెంటుకోర్టు. దాని కధిపతి సర్వాధికారముల కాజ్ఞాపించే ప్రకృతిలో గుర్వుప్రధాన మంత్రిగారే.

ఇక తనలోనున్న సహస్రారంకోర్టు సహస్రదళములతో సావకాశంగా ప్రకాశించేవారు పరమేశ్వరులు. ప్రకృతిలో ఆదివారం పరమాత్మదేకాబట్టి కోర్టులన్నీ కట్టివేసి నిత్యానందంతో ప్రకాశించే వజ్రవైఢూర్యాదినవరత్నములతో చేర్చిన సహస్రదళములకు ఇమిటేషన్ సహస్రశతసైన్యములతో ప్రకాశించే వైకుంఠమనే లండన్‌లో ప్రకాశిస్తూ అన్నిటికి సాక్షిమాత్రుడై ప్రజలుకోరు పాపపుణ్యములకు తాను కర్తవ్యముపూనక యీ వ్యవహారాలు ఈ ఆరుకోర్టులకు పంచి ప్రకాశమానమైన పవరు తానై నిలబడ్డ శ్రీ శ్రీ శ్రీ జార్జిచక్రవర్తి పరమాత్మకాదని గర్వించు అజ్ఞానులు తుదకు కృతయుగంలో మత్స్యావతారం పరమాత్మకాదని గర్వించిన సోమకాదిరాక్షసులును; కూర్మావతారం పరమాత్మకాదని గర్వించిన త్రామాఘాదిరక్కసులును;

వరహావతారం పరమాత్మకాదని గర్వించిన హిరణ్యాక్షకార్త వీర్యులును; త్రేతాయుగంబున నట్లే మహావీరులెందరో గర్వించి పరశురామునిచే హతులైరి. ఆపరశురాముడు శ్రీరామునిచే హతుడయ్యెను. ద్వాపరయుగంబున కృష్ణభగవానుడు పరమాత్మకాడని గర్వించినకౌరవులును, కంసశిశుపాలదంతవక్త్రిములును నరకాసురుడును ఏమైరో యీయుగములోని యట్టిగర్విష్ఠులుకూడ నుండిన యనేకమందిరాజులు అట్లే యగుదురు. కావున నాపరమాత్మ పంచిపెట్టిన ఆరుకోట్లులు ఏరాజకుటుంబములో నుంటే వారినే పరమాత్మయనక తప్పదు.

ఎందుచేతననగా అఉకార అకార మకారములత్రిపుటియై వచ్చిన ప్రాణబీజములారును, లయబీజములారును కలిసి ఒక మానవరూపమైయుండురు ఓం హ్రీం క్రీం శ్రీం శివాయబ్రహ్మణేనమః అయి వానిలోబీజములేదు షట్చక్రములనే కోట్లుగా ఏర్పడి యుండై దక్షరములు నమశ్శివాయ యనునైదవతారములై ఈఏడుకోట్లులు అయిదవతారములు ప్రకాశింపజేసేదే ఓమ్ అనుపవరు. ఈపవరు కోట్లులన్నిటిలోను పక్షపాతం లేకుండా ఒకేవిధంగాపనిచేస్తూ ఉంటోంది. ఇట్టితార్కాణము నిర్మలంగా కనుపిస్తూందికనుక శ్రీ శ్రీ శ్రీ జార్జిచక్రవర్తిని పరమాత్మయని భావించినవారు పూజింతురు. లేనివారు మానుదురు. పూజించుటెట్టిదనగా తొలియుగములలో పరమాత్మతో వచ్చిన వేదసంపుటీకరణభాషను పారాయణచేస్తూ పరమాత్మ దర్శనసిద్ధినిబొందినట్లు ఈయుగంలో ఈపరమాత్మతో వచ్చిన

శాస్త్రసంపుటియైనభాషను వేదముపోల్చి వల్లిస్తూ పరమాత్మ యనుగ్రహంపొంది పరీక్షలు ఎంతవఱకుప్యాసయితే అంతటి ఉద్యోగఫలితమును ఉద్యోగులుపొందుచున్నారు. ఇదియెల్లరకు దెలిసినదేయైనను మకారసంజ్ఞకల లయ దీనిని మరుగుపరుస్తోంది అది స్వాభావికముగాన శాంతాదిసద్గుణములు గ్రహింతురేగాని సామాన్యమానవులైన పామరులు తెలియలేరు.

ఆకారణమున మూడుయుగంబులందు వీరాధివీరులెల్ల పరమాత్మను గ్రహింపలేక పరమాత్మను గలసినవారిని జయింప లేకపోయిరో అట్లే ఈయుగమందు పరమాత్మలీలకలసిన శ్రీశ్రీశ్రీ జార్జిసార్వభౌముని ఈజర్మను దుండగీడయిన హిట్లరు, మధ్యగా ప్రవేశించిన జపాను ఒక్కపర్యాయం దండెత్తి వచ్చినాసరే జయించలేరు. ఇది ముమ్మాటికి నిశ్చయము ఇది శ్రీ విరాడ్విశ్వ కర్మయాజ్ఞ. ఇదే మహాపురుషుడైన ఏసుక్రీస్తుఆజ్ఞ. తుదకిదే మహాత్మా అనబడు దేశభక్తునియాజ్ఞ. ఓం సూక్ష్మం ఉకారం; ఓం ప్రకాశం అకారం; తుదకు 1962 సంవత్సరంనాటికి సర్వ ప్రపంచం శ్రీజార్జిపరమాత్మకు స్వాధీనం.

శ్రీ జార్జిపరమాత్మకు జై!

ఓం శాంతిః శాంతిః.

# శ్రీ భగవద్గీతాంతరార్థము

ఓమ్

ఉకార అకార మకారములలో సకారాంతమైన పరమేశ్వరుని అకార ఉకార మకార సకారాంతములో ఉద్భ

వించిన ఎరుక అనే శ్రీకారం. దానికధిదేవత శక్తియనే భారత మాత. ఆభారతమాత తనఆనందంకొఱకు తన్ను ప్రేమించిన పర మేశ్వరునితో తనలో పుట్టిన ప్రకృతియనే మానవులు యుక్తా యుక్త కార్యములుచేస్తూ ఈప్రపంచంలో ప్రారబ్ధము ననుభ వించుటయెట్లని ఆసాకారమైన పరమేశ్వరుని ప్రశ్నించినది. ఎట్ల నగా:-శ్లో. భగవన్ పరమేశాన భక్తి రవ్యభిచారిణీ। ప్రారబ్ధం భుజ్యమానస్య కధంభవతి హేప్రభో॥ ఓఅంతర్యామియైనప్రభో! ఈమానవులు భయంకరమైన ఈకలియుగంలో అవాఙ్మానస గోచరుండవైన నిన్ను గురించి నీకరుణ బడయుట యెట్లనిప్రశ్నిం చినది అంతట అకార ఉకార మకారములలో ఉత్పత్తియైన సాకారుడు ఓం అని పలుకుచు నుత్తరవుచెప్పుచున్నాడు.

శ్లో. ప్రారబ్ధం భుజ్యమానోపి గీతాభ్యా సరత స్తథా। సముక్త స్ససుఖీ లోకే కర్మణా నోపలిప్యతే॥ అనగా మకారసకా రములో ఉద్భవించిన నిరాకారమైన భారతమాతా! ఈకలియుగం లోఏమానవులు నిత్యము పెద్దలసేవచేస్తూ గురుముఖంగా ఉకార అకార మకారములలో ఉద్భవించిన సూక్ష్మశరీరమును, అకార ఉకార మకారములలో ఉద్భవించిన కారణ శరీరమును, మకార అకార ఉకారములలో ఉద్భవించిన స్థూలశరీరమును, వీటిత్రిపుటియై ప్రకాశించే పంచాక్షరములనే పంచముఖబ్రహ్మ మును, ఆబ్రహ్మమునకు స్థానమైన ఇంద్రియాదులను, త్రిపుటి యైన గుణములను, సర్వతత్వవిమర్శన చేసేసాంఖ్యమును, ఆపర బ్రహ్మబోధక తారకమును, పంచాక్షరములను పంచిపెట్టి తాను

అమనస్క-మర్యో క్రమమును విధివిధానముగ గురుసేవచేసి గురు విచ్చిన మంత్రమును మంత్రార్థముగా సిద్ధించునటుల త్రికాలము లందు నిశ్చలమనస్కులై ఈమాయాప్రపంచమునకు దొరకక, మూలరహితసంసారమునబడి పొర్లాడక, దానధర్మయాగాదు లకు వెనుదీయక, వచ్చినదానిని విడువక, రానిదానికానపడక, కలిగినంతలో తృప్తినంది అఖండసచ్చిదానందమయుడనైన నన్ను ఏయితరచింతలులేక పూజించుచు ఏయేకర్మలు చేస్తూన్నప్పటికి వారు చెందరు అని భారతమాతకు పరమేశ్వరుడు సమాధాన మిచ్చెను.

మరియు, శ్లో. గీతామే పరమావిద్యా బ్రహ్మరూపా నసంశయః। అర్ధమాత్రాక్షరా నిత్యా స్వనిర్వాచ్యపదాత్మికా॥ గీతయే నాకు పరమవిద్య. అది బ్రహ్మరూపము, ప్రణవస్వరూ పము, నాశరహితము, అనిర్వాచ్యము, నిత్యము అగుట సర స్సులో బుట్టినతామరసత్రమున కానీరంటనివిధమున ఏకర్మ చేసి నను వారినంటదు. ఇంకను శ్లో॥ యోష్టాదశాజపే నిత్యం నరో నిశ్చలమానసః। జ్ఞానసిద్ధింనలభతే తతోయాతి పరంపదం॥ ఏ మానవులు నిశ్చలమనస్కులై ప్రతిదినము పంచాక్షరీ-అష్టా క్షరీమంత్రములలో దేనిచేనైనను మనస్సునన్యథా పోనీక నిలిపి నన్నేపూజింతురో వారెట్టికర్మచేసినను తామ్మరిపుర్వనకు బురద అంటనిరీతిని వారిని చెందనేరదు.

మరియు, శ్లో. నకాంక్షే విజయం కృష్ణ నచరాజ్యం సుఖానిచ। కింనోరాజ్యేన గోవింద కింభోగై ర్జీవితేనవా॥ అనగా

ఏమానవులు కర్తృత్వము వదలి నాకు రాజ్యసంపదలుగాని మఱే యేయితరములుకాని కావలెనని కోరక నన్నే పూజింతురో వా రేకర్మచేసినను కట్టెవానికి పరిమళద్రవ్యములు పూసినను వాటిపరిమళం వ్రిశింపకమానినట్లు వారాఫలితమును పొందక మానరు. ఇంకను శ్లో॥ నజాయతే మ్రియతేవా కదాచిన్నా యంభూత్వా భవితావా నభూయః। అజో నిత్య శ్శాశ్వతోయం పురాణో నహన్యతే హన్యమానేశరీరే॥ ఈయాత్మ చచ్చునది; ఒకరిని చంపునది; ఒకరిచే చంపబడునది; ఒకరిని పుట్టించునది; ఒకప్పుడున్నది; ఒకప్పుడు లేనిదికాదు. ఇది ఏసంబంధమైనదో గురుముఖముగా విని వాటిఅభిమానము పొందకుండ ఏకర్మ చేయుచున్నను తాను చింతకాయ బొబ్బరంటనిచందమున ఆకర్మ వారిని చెందనేరదు.

అంతేగాక, శ్లో॥ తత్వవిత్తు మహాభాగో గుణకర్మవిభాగశః। గుణాగుణేషు వర్తంతే ఇతిమత్వా నసజ్జతే॥ అనగా జ్ఞానా జ్ఞానవిమర్శనచేయువారు ఇవి కర్మేంద్రియములు, ఇవి జ్ఞానేంద్రియములు, వాటివాటిపనులివ్వి అని ఆయింద్రియాదులచేష్టలకు కర్తృత్వమియ్యక నేనే బ్రహ్మమునని నన్నే సదా ధ్యానించువారేకర్మలాచరించినను సూర్యోదయముకాగానే మంచుపోవుకరణి వారిని చెందవు. మరియు, శ్లో॥ బ్రహ్మార్పణం బ్రహ్మహవిర్బ్రహ్మగ్నౌ బ్రహ్మణాహుతం। బ్రహ్మైవ తేనగంతవ్యం బ్రహ్మకర్మసమాధినా॥ ఏమానవులు హోమద్రవ్యములను, స్రుక్స్రువాది హోమసాధనములు, ఆయజ్ఞకర్త, భోక్త అంతయు బ్రహ్మమే

నని భావిస్తూ ఏకర్మచేసినను వెలుతురులో చీకటియడగినట్లు వారి నంటనేరదు. ఇంకను శ్లో॥ విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తినీ। శునిచైవ శ్వపాకేచ పండితాస్సమదర్శినః॥ అనగా ఏసాధువు అహంభావమును విడచి విద్వాంసుని, మూఢుని, తన స్వరూపమైన మానవజాతిని, పరమాత్మలీల కలసిన ఇతరజాతులను సమానభావముతో చూస్తూ తానేకర్మ చేసినను వరుణ సంచారమున దావాగ్ని యడగినట్లు, అతనిని జెందనేరదు. మరియు, శ్లో॥ శనైశ్శనై రుపరమేద్బుద్ధ్యా ధృతిగృహీతయా। ఆత్మసంస్థ మనఃకృత్వా నకించిదపి చింతయేత్॥ అనగా ఏ రాజయోగులు ధైర్యము వహించి మనస్సునన్యథా పోనీక యోగబంధనమొనర్చి కర్తృత్వమువదలి బలోన్మత్తుడై ఏకర్మచేసినను పాముసకు కుబుసమంటనిభాతి నంటనేరదు.

అంతేగాక, శ్లో॥ భూమిరాపోనలో వాయుః ఖం మనో బుద్ధిరేవచ। అహంకారయతీయమ్మే భిన్నాప్రకృతిరష్టధా॥ అనగా ఏయోగి పంచతన్మాత్రలైన పంచసూక్ష్మభూతములు, మనఃకారణమైన అహంకారతత్వము, దానికికారణమైన మహత్తత్వము, అవిద్యతోగూడిన అవ్యక్తత్వము అని లోకభ్రాంతికారణమని ఈమాయాశక్తియే పై అష్టవిధములుగా మారుతున్నదని గ్రహించి ఏకర్మచేసినను భుజంగపాదములు కానరానట్లు ఆయోగినిచెందవు. మరియు శ్లో॥ ఓమిత్యేకాక్షరంబ్రహ్మ వ్యాహరన్మామనుస్మరన్। యఃప్రయాతి త్యజన్దేహం సయాతి పరమాంగతిం॥ అనగా ఏజ్ఞాని అకార ఉకార మకారప్రతిపాదితమైన ఓమ్

అను ఏకాక్షరము నేనే యని నన్ను వీక్షిస్తూ సకలకారణభూతుడను నేనేనని తాను కర్తృత్వము విడచి యేకర్మచేసినను తానుచెందడు. ఇంకను, శ్లో॥ అనన్యాశ్రితయంతో మాం యేజనాః పర్యుపాసతే। తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహం॥ అనగా ఏజ్ఞానులు పరబ్రహ్మ ముకేస్వరూపమని నిశ్చలచిత్తముతో నన్నుమిఁ హా మఱియేమియులేదనే దృఢస్థితి నొంది నన్నే ధ్యానించుచు ఏకర్మచేసినను వారియోగక్షేమములభారము నేను వహింతును.

మఱియు శ్లో॥ అథవా బహునైతేన కింజ్ఞాతే నతవార్జున। విష్టభ్యాహ మిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్॥ అనగా ఏమానవులు విశేషజ్ఞానముచేత సర్వజగద్వ్యాప్తుడను నేనే అని కర్తృత్వమువిడతురో వారేకర్మ చేసినను నన్నే చెందును. ఇంకను శ్లో॥ మత్కర్మకృన్మత్పరమోమద్భక్తస్సంగవర్జితః। నిర్వైరస్సర్వభూతేషు యస్సమామేతి పాండవ॥ అనగా శ్రౌతస్మార్తాదిసకలకర్మలు, యాగయోగాభ్యాసములు నన్నుగూర్చి యెవరు చేయుదురో వారేకర్మచేసినను వారినంటదు. అంతేగాక శ్లో॥ అనపేక్ష శ్శుచి ర్దక్షః ఉదాసీనగతవ్యథః। సర్వారంభపరిత్యాగీ యోమద్భక్త స్సమేగురుః॥ అనగా ఏవరులు అపేక్షలేక పరిశుద్ధచిత్తముతో పక్షపాతమునీడి పాపభీతికలవారై ఏకర్మలను జేతురో వారు ఏకర్మచేసినను వారినంటదు. మఱియు శ్లో॥ అనపేక్ష శ్శుచి ర్దక్ష ఉదాసీనో గతవ్యథః। సర్వారంభపరిత్యాగీ యోమద్భక్త స్సమేప్రియః॥ అనగా అపేక్షలేనివారు, పరిశుద్ధ

చిత్తులు, పాపభీతులు, భక్తియన్న భయములేక ధైర్యముతో నెంతదూరమైనపోవువారును, ఏకర్మచేసినను వారినంటదు. అంతేగాక శ్లో॥ యథాసర్వగతం సౌక్ష్మ్యాదాకాశం నోపలిప్యతే। సర్వత్రావస్థితో దేహే తథాత్మానం నలిప్యతే॥ అనగా మంచిసీటి బురదనీరులం దాకాశ మొకేవిధంగా కనిపించునట్లు దేహములు వేరుగాని ఆత్మయొక్కటే యనియభేదముగ నెంచువా రేకర్మ చేసినను వారినంటదు.

ఇంకను, శ్లో॥ ప్రకాశంచ ప్రవృత్తించ మోహమేవచ పాండవ। నద్వేష్టి సంప్రవృత్తాని ననివృత్తాని కాంక్షతి॥ అనగా స్వభావయుక్తములైన యింద్రియాదులు తమకార్యము లవి మానవుగనుక వాటిని విశ్వసింపక కర్తృత్వము విడచి వచ్చిన దానిని విడువక రానిదాని నాశింపక ధర్మమును మరువక నేనే జ్ఞానినని మర్కటసైన్యమువలె కుతర్కవాదులను వెంటబెట్టుకొని తిరుగక సంకల్పవిహీను లేకర్మ చేసినను వారినంటదు. మరియు శ్లో॥ అహంవైశ్వానరోభూత్వా ప్రాణినాం దేహమాశ్రితః। ప్రాణాపానసమాయుక్తః పచామ్యన్నం చతుర్విధం॥ అనగా ఏమానవులు ప్రతివ్యక్తియందు జఠరాగ్నిగ, భోక్తగ, హరించువానిగ నన్నే యెంచి కర్తృత్వమువదలి యేపదార్థము భుజించినను, ఏకర్మచేసినను వారినంటదు. ఇంకను, శ్లో॥ యచ్ఛాస్త్రవిధిముత్సృజ్య వర్తతే కామకారతః। నసిద్ధి మవాప్నోతి నసుఖం నపరాంగతిం॥ అనగా వేదప్రమాణమును పెద్దలను గుర్వాజ్ఞను ధిక్కరించి నేనే గురువును సర్వజ్ఞుడను అనియేవో బిరుదములను

తగిలించుకొని వస్తునిరూపణలేని వేదాంతుల కెన్నియుగంబుల కైనను నేను కన్పించను.

అంతేగాక, శ్లో॥ అనుద్వేగకరంవాక్యంసత్యంప్రియహితంచ యత్। స్వాధ్యాయాభ్యసనంచైవ వాఙ్మయం తపఉచ్యతే॥ అనగా సకలప్రాణులకు భయము కలిగించునది, సత్యముపల్కు వారికి ధైర్యమిచ్చునది, నిత్యసత్యవర్తనులపలుకునందు నేనేయున్నానని కర్తృత్వమువదలి నన్ను పూజించుమానవు లేకర్మచేసినను వారినంటదు. మఱియు శ్లో॥ సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణంవ్రజ। అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః॥ అనగా ఏయోగులైన ధర్మాధర్మరూపసకలకర్మలు నేనేయనినమ్మి నాకంటెనితరములేదని నన్నే శరణందినవారేకర్మ చేసినను వారినంటదు. ఇంకను శ్లో॥ ఇదంతేనాతపస్కాయ నాభక్తాయ కదాచన। నచ శుశ్రూషవే వాచ్యం నచమాం యోభ్యసూయతి॥ అనగా ఈరహస్యమైన గీతాంతరార్థము మూఢులకు, సంసారకూపంలో చిక్కుకొన్నవారికి, దైవగురుభక్తిశూన్యులకు, చంచలమనస్కులకు తెలుపుటకు వీలులేదని భారతమాతకు పరమేశ్వరుడు సమాధానము చెప్పెను.

ఇది శ్రీభగవద్గీతాంతరార్థమనే ఎనన్ను.

---

ఓమ్.

## — కీర్తన —

శ్రీజార్జిమంత్రం, ఇది ఘన ఉద్యోగులకే యంత్రం,
శ్రీజార్జిమంత్రము పవరైనది, ప్రపంచమంతా ఏలేనన్నది,
శ్రీజార్జిమంత్రం, ఇది ఘన ఉద్యోగులకే యంత్రం॥
మూడురంగు లాధారమునున్నవి, ఆరక్షరములై
కోర్టులై తా ప్రపంచమంతా ఏలే నన్నది ॥శ్రీ॥ జా॥ మం॥ ౧
పన్నెండు విదహారూ ప్యాసైతే వద్దన్నను ధనమిస్తానన్నది జా॥ ౨
ఆధారము గణపతికి బదిలిగ సూపర్నెంటును వేసేనన్నది జా॥ 3
స్వాధిష్ఠానం బ్రహ్మకు మారుగ మేజస్ట్రీటును వేసేనన్నది,
మణిపూరకవిష్ణువునకు మారుగ కలక్టర్ గార్ని వేసేనన్నది జా॥ మం॥
అనాహతశివునకు యిమిడిమన్ శ్రీజడ్జీగారిని చూపేనన్నది జా॥
విశుద్ధాజీవాత్మకు బదిలీ గవర్నరుగార్నమర్చేనన్నది జా॥ మం॥ ౬
ఆజ్ఞేయమున గురునకు మారుగ చర్చిల్ ప్రధాన్ని నిలిపేనన్నది జా॥
సహస్రారమున పరమాత్మే తా ప్రపంచమంతా నిండేనన్నది జా॥
ఈమర్మము దెలిసేమహాత్ములంతా నాలో వారని పల్కుచున్నది జా॥
మహామునులువ్రాసిన వేదప్రమాణముసరిగా తనలో అమరినందునా
శ్రీప్రభువేపరమాత్మయనుచు మదివిమర్శించెనీనిత్యానందా జా॥

ఈరహస్యప్రాపంచసాంఖ్యము కృతయుగ త్రేతాయుగ ద్వాపరయుగములలో బ్రహ్మ ఈశ్వర విష్ణు గణపతి దేవేంద్రాదిదేవతలనంబడు మహాపురుషులు, ఈకలియుగంలో ఈపరమాత్మతో వచ్చినభాషామంత్రమును భక్తిశ్రద్ధలతో ఎవరు కష్టపడి సిద్ధినొందితే వారు ఆయా అధిష్ఠానము నలంకరిస్తూ ఆ

పరమాత్మయాజ్ఞ శిరసా వహించి ఈపరమాత్మనుగ్రహింపలేని యహంభావము కలిగిన మానవులను పరిపాలన చేస్తూన్నవారే ఉద్యోగులనంబడు మహాపురుషులు. అట్టివారి కీదేపరహస్యము తెలుపుమన్నారు.

ఓ మ్.

శ్రీకలియుగ అవతారపురుషుఃలీల ప్రికృతిలో మార్కాండేలాగంటారా, కృతయుగ త్రేతాయుగ ద్వాపరయుగములలో అకారసంజ్ఞ కలిగిన పరమేశ్వరుడు ఏనిరూపణచేత ప్రార్థిస్తే వారల కారూపముతో ప్రకాశించేవారు. ఇప్పు డీకలియుగంలో మానవరూపముతోనే ప్రికాశిస్తున్నారు. ఎట్లనగా, అకారసంజ్ఞ కలిగి ప్రకాశమానమైన తేజస్సు ఈకలియుగంలో శ్రీజాగ్రిప్రభువునందు లయమై యీప్రిభువుద్వారా ప్రికృతిలో తనలోవున్న మూడు రంగులు, అంతఃకరణచతుష్టయాలు, అష్టగుణములు, పదహారు కళలు, ప్రజలు జీవించే క్రమంగా యేర్పరచి, తాను సాక్షియై చూస్తూ ప్రికాశిస్తున్నారు.

ఏవిధంగానంటే:— ఉకార అకార మకారములు మూడు ఓం అను ఒక కానిగాను, అంతఃకరణచతుష్టయము నాలుగు కానులు ఒక అణాగాను, తనలోవున్నఅష్టయిశ్వర్యములనే గుణములు యెనిమిది బేడలుగాను, షోడశకళలు పదహారు అణాలుగాను, అనగా ఒకవ్యక్తి అనే మార్కాం రూపాయిగాను వేసి, దానిపైన తనలో ఉన్నపవరు అనే లీల ముద్రివేసి, ప్రజలకు జీవాధారం చూపిస్తూ ప్రకాశిస్తున్నారు.

అందుచేత పరమేశ్వరుడు అందరిహృదయములలోను ఉన్నాడు. ఎట్లో చూడండి! కోటీశ్వర్లుగాని, జమీందార్లుగాని, రోగులుగాని, సాధువులుగాని, సంసార్లుగాని, పెద్దలుగాని, పిన్నలుగాని ఎవరైనాసరే యీపరమాత్మఘాటోత్తో చేరిన ఒక కానీ లేకపోతే ఏమీ చేయలేరు. ఆ కారణమున ఎక్కడచూచినా తననామోచ్చారణయే. ఎందువెదకినా తనయాజ్ఞయే. ఇంతేకాక ఒకరివద్ద పుచ్చుకుంటే పరమేశ్వరాజ్ఞకావాలి. ఒకరికిస్తే పరమేశ్వరాజ్ఞ కావాలి. ఇలాగు నిరూపణతేలి ప్రత్యక్షంగా కనిపిస్తూండగా గ్రహించలేనివారే అహంభావముగల అజ్ఞానులని నానమ్మకం. ఓం హ్రీం శ్రీం శ్రీజార్జిపరమాత్మనే నమః. శ్రీ. శ్రీ. శ్రీ మంగళం.

ఇదే కలియుగద్వాదశాక్షరీమహామంత్రం, తత్వవిచారణ చేయు మహాపురుషులు ఈరత్నాకరంలో ఉన్న లోపములను బయటపెట్టక సవరణచేస్తూ అహంభావముతో ప్రవర్తించే మానవులకు శాంత శమ దమాదిగుణములు కలవారై బోధింతురుగాక. ఇదే మీలోవాడనైన నేను మీకు సహస్రవందనము లర్పించుచున్నాడను.

ఓం శాంతి శ్శా

సమాప్తము.

---

శాక్సముద్రాక్షరశాల, రాజమండ్రి.

